Rah-e-Haq ke Muhallik Khatrein
(Telugu)

# ధర్మపథంలో అవరోధాలు

మూలం
మౌలానా సద్రుద్దీన్ ఇస్లాహి

అనువాదం
అబ్దుల్ వాహెద్

# అనుక్రమం

*అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అల్లాహ్ పేరుతో*

# ముందుమాట

దాదాపు ఇరవై సంవత్సరాల క్రితం నేను 'జిందగీ' మాసపత్రిక కోసం ఒక వ్యాసం రాశాను. ఆ వ్యాసం ఆ పత్రికలో మూడు భాగాలుగా అచ్చయ్యింది. ఆ వ్యాసం సిద్ధాంతపరమైనది కాని, అధ్యయనం ప్రధానమైనదికాని కాదు. కేవలం కొన్ని జాగ్రత్తలు, హితవులు, హెచ్చరికలు ఉన్న వ్యాసం. జమాఅతె ఇస్లామీకి సంబంధించిన ఒక ముఖ్యమైన అవసరాన్ని దృష్టిలో ఉంచుకుని రాసిన వ్యాసం అది. అందువల్ల ఆ వ్యాసాన్ని పుస్తకంగా ప్రచురించాలన్న ఆలోచన కలిగింది. తద్వారా ఈ వ్యాసం చాలామందికి ప్రయోజనం కలి గిస్తుందని భావించడం జరిగింది. కాని పుస్తకంగా ప్రచురించడానికి చాలా ఆలస్యమైపోయింది. చివరకు ఇప్పుడు అనుకున్న విధంగా ఆ వ్యాసాన్ని పుస్తకరూపంలో ప్రచురించే పని చేపట్టడం జరిగింది. కొద్దిపాటి ముఖ్యమైన మార్పులు చేర్పుల తర్వాత ఆ వ్యాసాన్ని ఈ చిరు పుస్తకంగా మీ ముందుంచగలిగాను.

ఇది చిరుపుస్తకమే అయినా, ఇందులోని విషయం చాలా ప్రాముఖ్యం కలిగిన విషయం. ధర్మసంస్థాపనానికి ప్రయత్నిస్తున్న వారికి ఈ పుస్తకం ఎంతో ఉపయోగపడుతుందని, వారందరూ దీన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

*31 అక్టోబర్ 1977*

సద్రుద్దీన్ ఇస్లాహీ

*అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అల్లాహ్ పేరుతో*

# ధర్మపథంలో అవరోధాలు

## ఒక వాస్తవ నియమం, ఒక శాశ్వత హెచ్చరిక

ఏ ఉద్యమమైనా అందులో ముఖ్యమైన గుణగణాలు ఉన్నప్పుడే జయప్రదంగా ముందుకు సాగుతుంది. ఉద్యమాలకు జవజీవాలనిచ్చే లక్షణాలు ఉన్నప్పుడే అవి అప్రతిహతంగా ముందుకు సాగుతాయి. ఈ గుణగణాలు, లక్షణాలు కోల్పోయినప్పుడు, ఏ ఉద్యమమైనా చతికిలబడుతుంది. లేదా ఒక స్థాయికి చేరుకున్న తర్వాత గమ్యరహితంగా నిలబడిపోతుంది. ఉద్యమ గతిశీలానికి అవసరమైన లక్షణాల స్థానే ఇతర గుణగణాలు చోటుచేసుకున్నప్పుడు ఉద్యమానికి ఈ అవరోధాలు తప్పవు. ఉద్యమానికి నీరసాన్ని, నిష్క్రియాపరత్వాన్ని ప్రసాదించే లక్షణాలు చోటుచేసుకున్నప్పుడు ఈ పరిస్థితిని ఎదుర్కొనక తప్పదు. ఇదొక నిత్య సత్యం. సత్యసందేశాన్ని ఇచ్చే ఉద్యమాలయినా లేక ఇతర ఉద్యమాలయినా ఉద్యమాల చరిత్రలో ఈ సత్యాన్ని కాదనే ఉదాహరణ ఒక్కటి కూడా దొరకదు. మరో విధంగా చెప్పాలంటే ఇది శాశ్వతమైన, విశ్వజనీనమైన సత్యం. ఈ సత్యాన్ని కాదని ఏ ఉద్యమమైనా ఎన్నటికీ ముందుకు సాగలేదు.

అందువల్ల జయప్రదంగా ముందుకు సాగాలని, గమ్యాన్ని చేరుకోవాలని అభిలషించే ఏ ఉద్యమమైనా ఈ సత్యాన్ని ఎల్లప్పుడు దృష్టిలో ఉంచుకోవాలి. ఈ సత్యాన్ని విస్మరిస్తే, అంటే ప్రకృతిలోని స్థిరమైన చట్టాలను ఉల్లంఘిస్తే ఎదురయ్యే పరిణామాలకు సిద్ధంగా ఉండవలసి వస్తుంది. సత్యబద్ధమైన ఉద్యమం అయినప్పటికీ జనాకర్షణగలదే అయినప్పటికీ ఈ సత్యాన్ని విస్మరిస్తే ఎదురయ్యే ప్రమాదాన్ని తప్పించుకోలేదు. ఈ కారణం వల్లనే దైవప్రవక్త ముహమ్మద్ (స)ను సత్యధర్మ ప్రచారోద్యమానికి, సత్యధర్మ సంస్థాపనోద్యమానికి సారథిగా నియమించినప్పుడు ఆయనకు ఈ వాస్తవాన్ని స్పష్టంగా తెలుపడం జరిగింది.

అంతేకాదు తరచుగా ఈ వాస్తవాన్ని ఆయనకు పునశ్చరణ చేయడం కూడా జరిగేది. ఫలానా ఫలానా కారణాలు ఉద్యమ బాధ్యతలు నిర్వర్తించడానికి ఆటంకాలు అవుతాయి, ఫలానా ఫలానా గుణగణాలు మీలో చోటు చేసుకున్నట్లయితే విజయాన్ని సాధించలేరు అంటూ నిరంతరం ఆయనను హెచ్చరించడం జరిగింది. అంతేకాదు, కేవలం హెచ్చరికలు చేసి వదిలి వేయలేదు, గత జాతుల చరిత్రలను గుణపాఠాలు గ్రహించడానికి ఆయనకు తెలుపడం జరిగింది. గత జాతుల చరిత్రను, ధర్మప్రచారోద్యమాల ఉత్థానపతనాల వివరాలను కూడా తెలుపడం జరిగింది. ఈ సంఘటనల ద్వారా అనేక వాస్తవాలను వివరించడం జరిగింది. ముఖ్యంగా బనీఇస్రాయీల్ చరిత్రను పూర్తి వివరాలతో, అనేక సార్లు ప్రస్తావించి, ఆ జాతిని పతనానికి గురిచేసిన వాస్తవాలను విశదీకరించడం జరిగింది. ఈ వాస్తవాలు ఎలాంటివంటే వీటికి గురయిన ఏ జాతి అయినా సరే పతనానికి గురికాక తప్పదని తెలుస్తోంది. గత జాతుల ఈ సంఘటనలను గుణపాఠాలుగా దివ్యఖుర్‌ఆన్ ప్రస్తావించింది. ఈ సంఘటనలకు సంబంధించిన కథనాలు ముస్లిములకు మార్గదర్శనాన్ని ఇచ్చే కథనాలు. దివ్య ఖుర్‌ఆన్ గత జాతుల గుణపాఠం గరిపే సంఘటనలను వినిపించడమే కాదు, దానితో పాటు క్రింది విధంగా హెచ్చరించింది కూడాను.

> "అల్లాహ్‌ను మరిచిపోయిన వారి మాదిరిగా మీరు అయిపోకండి. (అల్లాహ్‌ను మరిచిపోవడం వల్ల) అల్లాహ్ వారిని తమను తాము మరిచిపోయేలా చేసాడు." (అల్ హష్ర్)

> "(అల్లాహ్ తరఫు నుంచి) స్పష్టమైన హితబోధ వచ్చిన తర్వాత కూడా వర్గాలుగా విడిపోయి, భేదాభిప్రాయాలలో చిక్కుకుపోయిన వారి మాదిరిగా వ్యవహరించకండి." (ఆలి ఇమ్రాన్)

దేవుడు చేసిన ఈ హితబోధను పాటించడం ద్వారానే ఏ జాతి అయినా విజయాన్ని పొందుతుంది. దివ్య ఖుర్‌ఆన్ చేసిన ఈ హెచ్చరికను ఎల్లప్పుడు దృష్టిలో ఉంచుకున్న జాతి మాత్రమే ముందుకు పురోగమించగలదు. ఈ హితబోధను పాటించినంత కాలం, ఈ నియమాలకు అనుగుణంగా నడుచు

కున్నంత కాలం ఇస్లామీయ సందేశం హృదయాలను జయిస్తూ ముందుకు పురోగమించింది. కాని తర్వాత కాలక్రమేణా ఈ హితబోధను, ఈ హెచ్చరికను విస్మరించడం ప్రారంభమైన తర్వాత, నివారించిన మార్గాలలో నడవడం ప్రారంభించినప్పటి నుంచి, విస్మరణకు, బాధ్యతారాహిత్యానికి గురయి దైవికంగా ఎదురయ్యే పరిణామం నుంచి తప్పించుకోలేకపోయింది.

దివ్యఖుర్‌ఆన్ చేసిన ఈ హెచ్చరిక ఒక మౌలికమైన, శాశ్వతస్థాయి కలిగిన హెచ్చరిక.

ఈ హెచ్చరికలోని ముఖ్యమైన విషయమేమంటే, ఏదేని జాతి లేదా అందులోని ఒక వర్గం తన జీవిత లక్ష్యం వైపు పురోగమించడానికి కదిలినప్పుడు ఈ ప్రయాణంలో ప్రారంభం నుంచి గమ్యం చేరే వరకు, గమ్యానికి చేరుకున్న తర్వాత కూడాను ఈ హెచ్చరికకు పూర్తి ప్రాధాన్యం ఇవ్వాలి. అంతేకాదు జాతులను, సందేశ ప్రచారోద్యమాలను నిర్వీర్యం చేసిన అంశాల పట్ల అనుక్షణం అప్రమత్తంగా ఉండాలి. ఈ అంశాలను గుర్తించడం నేడు తేలిక కూడా. ఎందుకంటే నేడు గత జాతుల ఉత్థానపతనాల సంఘటనలు, వాటి కారణాల చరిత్రే కాదు, స్వయంగా తాము ఎదుర్కొన్న పరిస్థితుల ఉదాహరణలు కూడా గుణపాఠాలు గరపుతున్నాయి. గత జాతులకు సంబంధించి వాటి ఉత్థానపతనాల కారణాలను కేవలం చదవడం మాత్రమే కాదు, నేడు ప్రత్యక్షంగా చూసుకోవడం కూడా జరిగింది. ఆ విధంగా సొంత అనుభవాలు కూడా ఉన్నాయి. అందువల్ల, నిశితంగా ఆలోచిస్తే, బాధ్యతాభావంతో యోచిస్తే, ఆలోచనలను ఆచరణలను సమీక్షించుకుంటే, ప్రస్తుత పతనావస్థకు కారణాలు ఒక్కటొక్కటిగా అర్థమవుతాయి. ఈ కారణాలను తొలగించకపోతే విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించడానికి సరికొత్త ప్రయత్నాలు ప్రారంభించే యోగ్యత లభించదు.

అయితే, విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించడానికి సరికొత్త ప్రయత్నాలు గతంలోను జరిగాయి. ధర్మప్రేమికులు, ధార్మిక సంస్థలు గతంలోను ఇస్లామ్ పునరుజ్జీవనానికి అనేక ప్రయత్నాలు చేశారు, ఉద్యమాలు నడిపారు. ఈ ఉద్యమాల వివరణాత్మక గాథలు ముస్లిం సముదాయం చరిత్రలో ప్రముఖ

అధ్యాయాలుగా సురక్షితంగా ఉన్నాయి. ఈ అధ్యాయాల వెలుగులో మార్గాన్ని గ్రహించడం నేడు ఇస్లామీయ ఉద్యమాలకు అంత కష్టం కాదు. ఎందుకంటే నేడు ఏ ఇస్లామీయ ఉద్యమమైనా అది సంస్థాపనా ఉద్యమంగా కాదు, పునరుద్ధరణ ఉద్యమంగానే భావించాలి. గతంలో నడిచిన ఉద్యమాల స్వభావం కూడా ఇలాంటిదే. అందువల్ల ఒకే స్వభావం ఉన్న ఉద్యమాలయినందువల్ల గత ఉద్యమాల చరిత్రను అధ్యయనం చేయడం, వాటిని విశ్లేషించడం నేడు ఇస్లామీయ ఉద్యమం లేక దేనికయినా చాలా అవసరం. ఈ అధ్యయనం వల్ల ప్రయోజనకరమైన అనేక విషయాలు నిస్సందేహంగా మన దృష్టికి వస్తాయి, సంస్థాపనా ప్రధానంగా నడిచిన ఉద్యమాలలో కనబడని కొత్త విషయాలు కూడా ఇలాంటి ఉద్యమాల అధ్యయనంలో మన దృష్టికి రావచ్చు.

చివరగా, నేడు ఇస్లామీయ ఉద్యమాలకు కావలసినది, ధర్మనిష్ఠ, సంయమనం, దృఢచిత్తం, బాధ్యతాభావాలు. సందేశప్రచార ఉద్యమాలకు సంబంధించిన సుదీర్ఘచరిత్రలో అన్ని విధాల ప్రచార సంబంధమైన అనుభవాలు, అన్ని విధాల సందేశప్రచార ప్రయత్నాలు మనకు కనబడతాయి. గత జాతుల చరిత్ర, స్వయంగా ముస్లిం సముదాయం చరిత్ర మన ముందు ఉంది. సంస్థాపనాత్మక ఉద్యమాల చరిత్ర, పునరుద్ధరణాత్మక ఉద్యమాల చరిత్ర సమస్తం అందుబాటులో ఉంది. ఇన్ని నిదర్శనాలు ఉన్నప్పటికీ, నేడు సందేశప్రచార ఉద్యమం చేపట్టినవారు తమ ఉద్యమానికి ఎదురయ్యే ప్రమాదాలను నివారించాలన్న ధ్యాస లేకుండడం అవివేకం తప్ప మరేమీ కాదు. అలాంటి వారు తమ సందేశప్రచార ఉద్యమం విజయం సాధించడాన్ని చూసే యోగ్యతను కోల్పోతారు.

## ఆత్మపరిశీలన- ఇస్లామీయ ఉద్యమాలకు అవసరం

పైన పేర్కొన్న సూత్రప్రాయమైన హెచ్చరిక ప్రపంచంలోని ఇతర ఉద్యమాలకు ఎంత ముఖ్యమైనదో, తహ్రీక్ ఇస్లామీ హింద్‌కు కూడా అంతే అవసరం. మరో విధంగా చెప్పాలంటే, ఈ ఉద్యమం ముందుకు సాగుతూ, ఒడుదుడుకులు, సవాళ్ళు, పతనావస్థలు, విభేదాలు వంటి అవరోధాల

విషయంలో ఎంతవరకు అప్రమత్తంగా ఉందన్న విషయంపైననే దాని భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. ఈ అవరోధాలు గతంలో అనేక ఉద్యమాలను నిర్వీర్యం చేశాయి. అనేక ఉద్యమాలను గమ్యం చేరిన తర్వాత కూడా గమ్యరహితంగా, మార్గరహితంగా చతికిలబడేలా చేశాయి. ఇస్లామీయ ఉద్యమం ముస్లిం సముదాయంలోని వివిధ వర్గాల ప్రజల ఆలోచనలు, ఆచరణలను లోతుగా పరిశీలించింది. ఈ వర్గాల్లో కనిపించిన ఉదాసీనత, ఉపేక్ష భావాలను ఎలాంటి మొహమాటం లేకుండా బట్టబయలు చేసింది. ముఖ్యంగా ఆలోచనాపరమైన, ఆచరణాపరమైన ఉదాసీన వైఖరుల విషయమై ఒక్కోసారి కఠినంగా కూడా విమర్శించింది. ఈ ఉదాసీన వైఖరులే ముస్లిం సముదాయాన్ని అసలు లక్ష్యానికి, అసలు ధ్యేయానికి దూరమయ్యేలా చేసాయి. సందేశప్రచార ప్రయోజనాల దృష్ట్యా, ధార్మిక వివేచన దృష్ట్యా ఈ వైఖరుల పట్ల కఠినంగా వ్యవహరించడం అవసరమయ్యింది. అయితే కఠినంగా విమర్శించినంత మాత్రాన విమర్శ, సమీక్షల బాధ్యత నిర్వర్తించినట్లు కాదన్న వాస్తవాన్ని కూడా దృష్టిలో ఉంచుకోవాలి. ఈ బాధ్యతను పూర్తిగా నిర్వర్తించడానికి ఇంకా చేయవలసినది చాలా ఉంది. వాస్తవమైన విమర్శ, నిజమైన సమీక్షలు జరగాలంటే చేయవలసినది చాలా ఉంది. వాస్తవ విమర్శ అంటే స్వయంగా తనపై తాను చేసుకునే విమర్శ. అలాగే స్వయంగా తన ఆలోచనలు, ఆచరణలను సమీక్షించుకునే ఆత్మపరిశీలన అవసరం. ఇతరుల ఆలోచనలు, ఆచరణలను సమీక్షించడం, విమర్శించడం అన్నది ఎప్పుడోకాని అవసరం ఉండదు. కాని తనను తాను విమర్శించుకోవడం, సమీక్షించుకోవడం ఎల్లప్పుడు అవసరమవుతుంది. అందువల్ల ఎల్లప్పుడు కళ్ళుతెరుచుకుని తాను చేసే పనులపై దృష్టి ఉంచడం అవసరమవుతుంది. అప్రమత్తంగా ఉంటూ తన వల్ల సందేశప్రచార ఉద్యమాన్ని నిర్వీర్యం చేసే పాత పొరబాట్లు, తప్పిదాలు, గతంలో అనేక ధార్మిక, సందేశప్రచార ఉద్యమాలను నిర్వీర్యం చేసిన కారణాలు తన వల్ల పునరావృతం కాకుండా జాగ్రత్త వహించాలి. ఈ విధంగా ఆత్మపరిశీలన, ఆత్మ విమర్శ ఏర్పాటు లేనట్లయితే, ఉద్యమాన్ని నడుపుతున్న పెద్దలు ఈ ఏర్పాటుకు సంబంధించిన తమ బాధ్యత పట్ల నిర్లక్ష్యం వహిస్తే, ప్రమాదకరమైన ఈ వైఖరులు, ధోరణులకు సంబంధించి ఉదాసీనంగా

పరిమితమైన బాధ్యత కాదు. ఎవరికైనా అవగాహన, ఆలోచనా పరమైన శక్తిసామర్థ్యాలు తక్కువ ఉన్నట్లయితే అతని బాధ్యత తదనుగుణంగా పరిమితమవుతుంది. అంతేకాని అసలు బాధ్యత లేకుండా చేయడమన్నది జరగదు. అందువల్ల జమాఅత్‌లో ఆలోచనలు, ఆచరణలపరమైన రుగ్మతలు తలెత్తకుండా చూడవలసిన బాధ్యత జమాఅత్ పెద్దలది మాత్రమే అని జమాఅత్‌కు సంబంధించిన వారెవరయినా భావించడం, తమవంటి సాధారణ కార్యకర్తలపై అందుకు సంబంధించిన బాధ్యత ఏమాత్రం లేదని తలపోయడం ప్రమాదకరమైన అపోహ. ఇలాంటి తప్పుడు ఆలోచనలతో ధర్మసంస్థాపనా ఉద్యమంలో ఆరోగ్యవంతమైన పాత్రను పోషించలేము. ఈ అపోహ విస్తరించి ఉద్యమంలో సర్వసాధారణ భావనగా మారితే ఆ ఉద్యమానికి జీవన్మరణాల సమస్య ఎదురైనట్లే.

ఇందుకు సంబంధించిన ముందుజాగ్రత్త చర్యలు ఏమంటే, ఖుర్ఆన్, ప్రవక్త (స) ప్రవచనాల్లో మౌలిక హితబోధలను, గత కాలాలకు సంబంధించిన ధార్మిక ఉద్యమాలు, సందేశప్రచార ఉద్యమాలకు సంబంధించిన చరిత్రను లోతుగా అధ్యయనం చేయడం. ఈ అధ్యయనం వెలుగులో ఉద్యమాలకు నష్టం కలిగించే రుగ్మతలను ఖచ్చితంగా గుర్తించాలి. ఈ రుగ్మతలను గుర్తించి, వాటి గురించి వివరంగా తెలుసుకున్నంత మాత్రాన సరిపోదు. కేవలం ఒక పరిశోధకుని మాదిరిగా ఈ విషయాలు తెలుసుకుని సంతృప్తి చెందడం కాదు, ఈ రుగ్మతలు, వాటి కారణాలను ఒక గుణపాఠంగా గ్రహించాలి. ఒక ధర్మ సందేశ ప్రచారకునికి శోభించే విధంగా ఈ అధ్యయనాలలో గ్రహించిన విషయాలను తన ముందు తప్పొప్పులు చూపే దర్పణం మాదిరిగా ఉంచుకుని అప్రమత్తంగా వ్యవహరించాలి. ఈ దర్పణం ఎప్పుడైనా ఏదైనా ఆలోచనా పరమైన, లేదా ఆచరణాపరమైన లోపాన్ని ఎత్తిచూపితే, ఆ లోపాన్ని పరిష్కరించ డానికి తక్షణం పూనుకోవాలి. ఈ విషయంలో ఎలాంటి ఉదాసీనత, నిర్లిప్తతలకు తావివ్వరాదు.

గమనించవలసిన విషయమేమంటే అద్దంలో మన రూపురేఖలను చూసుకోవడం తేలిక. కాని గుణపాఠాలు గరిపే అధ్యయనా దర్పణంలో మన అంతర్గత స్వరూపాన్ని దర్శించడం అంత తేలిక కాదు. నిజానికి ఇది చాలా

వ్యవహరిస్తే ముస్లిం సముదాయంలో ఇప్పటి వరకు నడిచిన చరిత్రనే మరలా పునరావృతం చేయడం తప్ప మరేదీ సాధించలేరు. ముస్లిం సముదాయంలో సుదీర్ఘకాలం నుంచి పరిస్థితి ఎలా ఉందంటే, దివ్యఖుర్‌ఆన్ ప్రస్తావించిన ఇతర జాతుల తప్పిదాలు, వారి ఆలోచనలు, ఆచరణలనయితే ఖండిస్తూంది, కాని స్వయంగా తమలో అవే వైఖరులు, ధోరణులు పొడసూపాయన్న వాస్తవాన్ని గ్రహించడం లేదు. ముస్లిం సముదాయం వ్యవస్థాపక లక్ష్యం గురించిన స్పృహతో, ఆ లక్ష్యాన్ని నిర్వర్తించడానికి నడుంకట్టిన వారు ఈ వైఖరికి అంటే తాము భేషుగ్గా ఉన్నామని, ఇతరులకే హితబోధ అవసరమన్న వైఖరికి దూరంగా ఉండడం అవసరం. లేనట్లయితే, ఇతరుల తప్పిదాల గురించి ఏకరువు పెట్టడంలోనే వాళ్ళు తలమునకలై ఉంటారు కాగా, అవే తప్పిదాలు, పొరబాట్లు వారి విశ్వాసశక్తిని, ఆచరణా పటిమను చెదలా తినేస్తాయి. ఇలాంటి ప్రమాదకర పరిస్థితి రాకుండా దేవుడు కాపాడుగాక! కాని ఉద్యమాల చరిత్రలో అనేక సార్లు చోటుచేసుకున్న రుగ్మత మరోసారి రాదన్న భరోసా ఏదీ లేదు. అందువల్ల ఆ రుగ్మత చోటుచేసుకునే అవకాశాలను దృష్టిలో ఉంచుకుని ఈ ప్రమాదాన్ని నివారించడానికి అనుక్షణం అప్రమత్తంగా ఉండాలి. అంటే సందేశ ప్రచార ఉద్యమాన్ని నీరుగార్చే రుగ్మతలు చోటు చేసుకునే వరకు వేచి ఉండే బదులు అవి తలెత్తకుండా ముందు నుంచే వాటిని నిరోధించడానికి కృషి చేయాలి. ఈ విషయమై ఎలాంటి నిర్లక్ష్యం, ఉదాసీనత పనికిరాదని గుర్తించాలి.

## ఆత్మపరిశీలనకు మౌలిక పద్ధతి

జమాఅత్‌లో ఏ హోదా లేదా స్థాయికి చెందిన వ్యక్తి అయినా, వ్యక్తిగతంగా ఎలాంటి శక్తిసామర్థ్యాలు ఉన్న వ్యక్తి అయినా జమాఅత్‌కు సంబంధించిన బాధ్యతల్లో ఆత్మపరిశీలనను అతి ముఖ్యమైన వ్యవహారంగా భావించనంత వరకు ఈ బాధ్యతకు పూర్తి న్యాయం చేకూర్చలేడు. జమాఅత్‌లోని వారందరికీ ఈ విషయమై సమాన బాధ్యత ఉందని చెప్పలేము, కాని అందరికీ బాధ్యతా భావం ఉండాలన్నది కూడా మరచిపోరాదు. ఉన్నత హోదాలో ఉన్న వారికి ఈ బాధ్యత మరింత ఎక్కువ ఉంటుంది. అయితే కేవలం సంబంధిత హోదాలో ఉన్న వారికే

కష్టసాధ్యమైన పని. రెండు విషయాలను దృష్టిలో ఉంచుకోనట్లయితే ఈ కష్టాన్ని అధిగమించడం సాధ్యం కాదు.

మొదటి విషయమేమంటే, మనోవాంఛలపై గట్టి నిఘా ఉండాలి. తప్పులు, పొరబాట్లను సమర్థించుకోవడంలో మనస్సు చాలా చురుగ్గా వ్యవహరిస్తుంది. ఆ తప్పులను సమర్థించుకోవడానికి కావలసిన ఆధారాలను క్షణాల్లో సిద్ధం చేయగల శక్తిసామర్థ్యాలు దానికి ఉన్నాయి. ఆత్మపరిశీలనలో మనకు కనబడే తప్పులు లోపాలపై ఒక అందమైన ముసుగు లాంటి సమర్థింపును కప్పడానికి మనస్సు క్షణం ఆలసించదు. మనిషిలో సహజంగా ఉండే బలహీనతల వల్ల ఈ సమర్థింపులతో సంతృప్తి చెందుతాడు. తన వల్ల ఎలాంటి తప్పు జరుగ లేదని, తాను చేసిన ఫలానా పనిలో నిజానికి ఎలాంటి తప్పులేదని, కొన్ని కారణాల వల్ల ఆ పని చేయడం మంచిదేనని భావిస్తాడు. మనసు చేసే ఈ మాయల పట్ల అప్రమత్తంగా ఉండడం చాలా అవసరం. అప్పుడే ఆత్మావలోకనం విషయంలో జయప్రదంగా ముందుకు సాగగలం.

ఇక రెండవ విషయమేమంటే, ఆలోచనాపరమైన, ఆచరణాపరమైన ఉదాసీనతలకు సంబంధించి అప్రమత్తంగా ఉండడం. ఈ ఉదాసీనతలు ప్రతిసారీ ఒకే విధంగా ఉండవలసిన అవసరం లేదు. గత ఉద్యమాలలో తలెత్తిన రూపంలోనే ఈసారి కూడా చోటుచేసుకుంటాయని చెప్పలేము, వాటి రంగు రూపాలు మారిపోవచ్చు. షైతాను ప్రత్యేకత ఇదే. షైతాను తన దుష్ప్రేరణలను, దుష్టబోధనలను ఒకే విధంగా, ఒకే రూపంలో ప్రతి వ్యక్తి ముందు ఉంచడమన్నది ఎన్నడూ జరుగదు. చాలా తెలివిగా వ్యవహరిస్తాడు, మనిషి బలహీనతలను, ఆలోచనా ఆచరణాపరమైన లోపాలను దృష్టిలో ఉంచుకుని మనిషి తేలిగ్గా తన వలలో పడేలా వ్యవహరిస్తాడు. ఫలితంగా మనిషి దేనిని వ్యతిరేకిస్తాడో, దేనిని ఈసడించుకుంటాడో అదే విషయాన్ని సరికొత్త రూపంలో స్వీకరించడం జరుగు తుంది. చక్కెర పూసిన విషపు గుళికలనే కాదు, చక్కెర రంగులో కనబడే విషపు గుళికలను కూడా ఒక్కోసారి అమృత మాత్రలుగా భావించి నోటిలో వేసుకొనే ప్రమాదం ఉంది. షైతాను చేసే ఈ మాయల విషయమై అప్రమత్తంగా ఉండడం అవసరం.

ఈ రెండు ఆవశ్యక విషయాలను దృష్టిలో ఉంచుకున్న తర్వాత మాత్రమే ఎవరైనా సరియైన విధంగా ఆత్మపరిశీలన జరుపగలరు. అప్పుడు మాత్రమే తమ ఆచరణలు, ఆలోచనలను సరియైన విధంగా సమీక్షించుకోగలరు.

## ఇస్లామీయ ఉద్యమాలకు ఎదురయ్యే ముఖ్యమైన అవరోధాలు

ఇస్లామీయ ఉద్యమాలను పతనానికి గురిచేసే, నిర్వీర్యం చేసే విషయాలేవో పరిశీలిద్దాం. వైఫల్యానికి దారితీసిన కారణాలన్నింటి చిట్టా తయారు చేయడం కష్టం. ఎందుకంటే ఈ కారణాలు నిర్దిష్టంగా ఉండవు. పరిమితంగా కూడా ఉండవు. వివిధ ఉద్యమాలు విభిన్న అంతర్గత, బాహ్య కారణాల వల్ల, పరిస్థితుల వల్ల వైవిధ్యాన్ని కలిగివుంటాయి. అందువల్ల కేవలం మౌలిక కారణాలను, ప్రమాదకరమైన రుగ్మతలను, ప్రతి ఇస్లామీయ ఉద్యమం ఎల్లప్పుడు దృష్టిలో ఉంచుకోవలసిన వాటిని మాత్రమే ఇక్కడ పరిశీలిద్దాం.

## 1. దైవం పట్ల అంకిత భావం లోపించడం

ఇస్లామీయ ఉద్యమాల పతనానికి కారణాలలో అతి ముఖ్యమైనది. ఉద్యమ కార్యకర్తల చిత్తశుద్ధిని, దైవం పట్ల అంకితభావాన్ని ఈ రుగ్మత తినేస్తుంది. ఈ రుగ్మత ఎంత తీవ్రంగా ఉంటే ఉద్యమం అంతగా జీవాన్ని కోల్పోయి, మరణానికి దగ్గరవుతుంది. కేవలం ఈ ఒక్క కారణం వల్ల ఉద్యమం పతనావస్థకు చేరుకుంటుందని చెప్పలేము కాని పతనానికి కారణమయ్యే అనేక అంశాల్లో ఇది అతి ముఖ్యమైనది. అంతేకాదు, రెండు విధాలుగా ఈ రుగ్మత మిగిలిన కారణాలకన్నా విభిన్నమైనది.

ఒకటి, ఇది ఉద్యమానికి ప్రాణాంతకమైన రుగ్మత. ఈ రుగ్మత తీవ్రంగా వ్యాపించడం జరిగితే దీనిని నివారించడానికి ఎలాంటి ఉపాయాలు కూడా ప్రయోజనాన్ని ఇవ్వలేవు. కాని ఇతర కారణాలు ఇంతగా ప్రాణాంతకమైనవి కావు. ఎందుకంటే ఇతర కారణాల ప్రభావాన్ని ఏదో ఒక విధంగా పరిమితం చేయవచ్చు.

ఇక రెండవ విషయమేమంటే, మిగిలిన కారణాలలో కూడా కొన్ని ఏదో ఒక విధంగా ఈ తల్లివేరుతోనే సంబంధం కలిగి ఉంటాయి. ఈ రుగ్మత వల్ల జనించినవే అయివుంటాయి. అలాగే చాలా కారణాలు వివిధ మానసిక బలహీనతల వల్ల జనించినవి కూడా ఈ రుగ్మత వల్ల, అంటే చిత్తశుద్ధి, దైవం పట్ల అంకితభావం లోపించడం అన్న రుగ్మత వల్ల ప్రేరణ పొంది శరవేగంగా బలపడతాయి. ఉద్యమాన్ని దెబ్బతీసే స్థాయికి ఇతర కారణాలను బలవత్తరం చేస్తుందీ రుగ్మత. ఈ రెండు కారణాల వల్ల ఉద్యమాల పతనానికి సంబంధించి ఈ రుగ్మతకు ప్రథమ ప్రాధాన్యం ఉంది. అందువల్ల ఈ రుగ్మత జనించడానికి కారణాలు, లక్షణాలు, ప్రభావాల విషయమై ఎల్లప్పుడూ అప్రమత్తంగా ఉండడం అవసరం.

ఇక్కడ గమనించదగిన రెండు విషయాలు - చిత్తశుద్ధి, దైవం పట్ల అంకితభావం - వీటి గురించి తెలుసుకోవడం కూడా అవసరం.

చిత్తశుద్ధి అంటే ఉద్యమ లక్ష్యం పట్ల హృదయపూర్వక నిబద్ధత కలిగి ఉండడం. ఆ లక్ష్య సాధన కోసం ఏకాగ్రచిత్తంతో శాయశక్తులా కృషి చేయాలన్న వైఖరి కలిగి ఉండడం. మరో పని దేనితోనూ దీనిని కలిపివేయరాదు. ఆ దిశగా ఆలోచించరాదు. ప్రయత్నాలు, ఆచరణలు అన్నీ ఈ లక్ష్యసాధన దృష్టితోనే ఉండాలి. ఆలోచనల్లో ఈ లక్ష్యమే ఉండాలి. ఆచరణలన్నీ ఈ లక్ష్యం కోసమే ఉండాలి. ఇతర విషయాలతో సంబంధం కూడా ఉద్యమ లక్ష్యం స్ఫూర్తికి అనుగుణంగా మాత్రమే ఉండాలి. లేదా ఉద్యమ లక్ష్యం అనుమతించిన మేరకు మాత్రమే ఆ సంబంధాలు ఉండాలి.

ఇక దైవం పట్ల అంకితభావం అంటే అర్థం, ఉద్యమ లక్ష్యం పట్ల ఈ నిబద్ధత, ఈ సంబంధం, ఈ చిత్తశుద్ధి కేవలం దేవుని కోసం, దైవప్రీతిని పొందడం కోసం ఉద్దేశించినవై ఉండాలి. దైవప్రీతి తప్ప మరెవరి ప్రసన్నత గురించి కూడా మనసులో ఉండరాదు. ఈ వాస్తవ ప్రయోజనం తప్ప మరే ప్రయోజనమూ దృష్టిలో ఉండరాదు. వ్యక్తిగత ప్రయోజనాలు కాని, కుటుంబ ప్రయోజనాలు కాని, జాతి ప్రయోజనాలు కాని, సముదాయం ప్రయోజనాలు కాని, పార్టీ ప్రయోజనాలు

కాని చివరకు ప్రపంచ ప్రయోజనాలు కాని ఏవి కూడా ఉద్యమ లక్ష్యం పట్ల నిబద్ధతకు ప్రేరణనిచ్చే అర్హత కలిగి లేవు. ఉద్యమ లక్ష్యం పట్ల నిబద్ధతకు అసలు ప్రేరణ దేవుని ప్రసన్నత పొందడం, మరణానంతర సాఫల్యాన్ని పొందడం మాత్రమే కావాలి.

ఈ లక్షణమే, ఈ దైవం పట్ల అంకితభావమే ఉద్యమాన్ని ఇస్లామీయ ఉద్యమంగా, ఇతర ఉద్యమాలకు విభిన్నంగా ఉన్నత స్థాయిలో నిలబెడుతుంది. అలా కానట్లయితే, నిబద్ధత, నిజాయితీలకు సంబంధించినంత వరకు ఈ లక్షణాలు ఇస్లామీయ ఉద్యమానికి ఎంత అవసరమో, ఇస్లామేతర ఉద్యమాలకు కూడా అంతే అవసరం. అందువల్ల ఇస్లామీయ ఉద్యమానికి కేవలం నిజాయితి, నిబద్ధత ఉన్న కార్యకర్తలు సరిపోరు, దైవప్రీతి కోసం నిబద్ధత, నిజాయితి కలిగి ఉన్న కార్యకర్తలు అవసరమవుతారు. అందువల్లనే ముస్లిం సముదాయాన్ని ధర్మసంస్థాపనానికి, సత్యానికి సాక్ష్యం ఇవ్వడానికి నియమించినప్పుడు, ఈ పనిని కేవలం దేవుని ప్రీతి పొందడానికి మాత్రమే చేయాలన్న విషయాన్ని కూడా తెలియజేయడం జరిగింది.

“విశ్వాసులారా! న్యాయానికి ధ్వజవాహకులుగా, దేవునికి (సత్యానికి) సాక్షులుగా మారండి” (అన్నిసా) అని చెప్పడం జరిగింది.

అందువల్ల ఇస్లామీయ ఉద్యమాలకు నిజమైన లక్ష్యం, ధర్మసంస్థాపనం అన్న లక్ష్యాన్ని సాధించే ఈ పని కేవలం దేవుని ప్రీతి పొందడానికి ఉద్దేశించినది కానట్లయితే, ఆ ఉద్యమానికి ఏ పేరు పెట్టుకున్నాగాని, ఆ ఉద్యమం ధర్మ సంస్థాపనా ఉద్యమం కాదు, సత్యానికి సాక్ష్యం ఇచ్చే ఉద్యమం కాదు. సత్యధర్మ సంస్థాపనానికి నిజాయితి, నిబద్ధతలు హృదయస్పందనల వంటివి అయితే, దైవం పట్ల అంకితభావం అన్నది ఆ హృదయంలో ప్రవహించే స్వచ్ఛమైన రక్తం వంటిది. ఇలాంటి స్వచ్ఛమైన రక్తం హృదయంలో లేనట్లయితే, అలాంటి హృదయంలో జీవం ఉన్నదని చెప్పలేము.

దేవుని ప్రీతి, మరణానంతర సాఫల్యం – ఈ భావనల విషయంలో ఎలాంటి అపోహలు ఉండరాదు. అపోహలంటే, చిత్తశుద్ధి, దైవం పట్ల

అంకితభావానికి సంబంధించిన లోపాలకు ఫలితాలు కేవలం దేవుని వద్ద మాత్రమే బహిర్గతమవుతాయని భావించరాదు. ఈ ప్రపంచంలో ఆ ఫలితాలు వెలువడవని అనుకోరాదు. వ్యక్తులకు సంబంధించి, వారి వ్యక్తిగతస్థాయిలో అయితే ఈ ఫలితాలు పరలోకంలో మాత్రమే సిద్ధిస్తాయన్నది నిజమే. కాని వ్యక్తులు కలిసి ఏర్పరచిన జమాఅత్, ఆ జమాఅత్ చేపట్టిన ఉద్యమం ఈ లోపాల పర్యవసానాలను ఈ ప్రపంచంలోనే చవిచూడవలసి ఉంటుంది. ఎందుకంటే ఈ ప్రపంచం వ్యక్తులకు సంబంధించి కేవలం ఆచరణల నిలయం మాత్రమే కావచ్చు, కాని ఉద్యమాలకు సంబంధించి ఈ ప్రపంచమే ప్రతిఫలం పొందే స్థలం. అందువల్ల ఇస్లామీయ ఉద్యమానికి సంబంధించిన కార్యకర్తలలో నిబద్ధత, చిత్తశుద్ధి, దైవం పట్ల అంకితభావాలు లోపిస్తే, ఆ ఉద్యమం అవసరమైన ప్రయాణ సామగ్రి లేకుండానే ప్రయాణం ప్రారంభించిందని భావించాలి. ఇక ఏ మజిలీలో చతికిలబడుతుందో చెప్పలేము.

ఇస్లామీయ ఉద్యమాలకు సంబంధించి అనుభవాలు, బుద్ధివివేకాలు చెప్పే వాస్తవం ఇదే. అందువల్లనే దివ్యఖుర్ఆన్ ఈ వాస్తవాన్ని అనేక పర్యాయాలు గుర్తు చేసింది. ధర్మమార్గాన చేసే ప్రయత్నాలు సఫలం కావడమన్నది దేవుని సహాయసహకారాలపై ఆధారపడి ఉంటుందని స్పష్టం చేసింది. అలాంటప్పుడు ఇస్లామీయ ఉద్యమం దేవుని కోసం, దేవుని ప్రీతి పొందాలన్న ఉద్దేశ్యంతో నడుస్తున్నది కానట్లయితే, అలాంటి ఉద్యమానికి దేవుని సహాయసహకారాలు పొందే హక్కు గాని, ఆశ గాని ఉంటాయా? అలాంటి ఉద్యమానికి దేవుడు ఎందుకు సహాయసహకారాలు అందిస్తాడు. ఆయన ఎలాంటి అవసరమూ, అగత్యమూ లేనివాడు. దేవుణ్ణి పిలిచేవాడు హృదయపూర్వకంగా పిలిస్తే దేవుడు ఆ పిలుపును వింటాడని, తన కోసం పనిచేసే వారికి సహాయపడతాడని మాత్రం ఆశించగలము.

బుద్ధివివేకాలు, అనుభవాల దృష్ట్యా చూస్తే, ఉద్యమాలు సఫలం కావడానికి అవసరమైన అంతర్గత సమైక్యతా భావన అన్నది చిత్తశుద్ధి, నిబద్ధత, దైవం పట్ల అంకిత భావం లోపించిన ఇస్లామీయ ఉద్యమాలకు ఎన్నడూ

లభించదని అర్థం అవుతుంది. అసలయిన, వాస్తవమైన ఉద్దేశ్యం లోపించి నందువల్ల ఉద్యమానికి సంబంధించిన కార్యకర్తలు, కార్యకర్తల వివిధ యూనిట్లు తమకు సంబంధించి వేర్వేరు ఉద్దేశ్యాలతో పనిచేయడం, ప్రణాళికలు వేయడం ప్రారంభిస్తారు. ప్రతి వర్గం తనకు ఇష్టమైన లక్ష్యం వైపునకు పూర్తి ఉద్యమాన్ని లాక్కెళ్ళే ప్రయత్నం చేస్తుంది. ఫలితంగా ఆలోచనల సారూప్యం, ఆచరణల సమన్వయం ఉండదు. చివరకు ఉద్యమం నానావిధ ఒత్తిళ్ళు, సంఘర్షణలకు గురయి చివరకు అంతం అవుతుంది. ప్రపంచంలోనే అతి పెద్ద స్థాయిలో కొనసాగిన సందేశప్రచార ఉద్యమ చరిత్ర ఒక ఉదాహరణగా మన ముందు ఉంది. ఈ ఉద్యమ ధ్వజవాహకుల్లో చిత్తశుద్ధి, నిజాయితి, నిబద్ధత, సత్యసంధత, దైవం పట్ల అంకిత భావం ప్రబలంగా ఉన్నంత కాలం వారికి దేవుని సహాయం లభించింది. విజయాలు వారిని వరించాయి. అనేక జాతులు ఆ ఉద్యమం పట్ల తమ విశ్వాసాన్ని ప్రకటించాయి. కాని తర్వాత సమతుల్యం దెబ్బతినడం ప్రారంభం కాగానే, ఉద్యమ ధ్వజవాహకుల్లో దైవప్రీతి పట్ల అభిలాష, చిత్తశుద్ధి, నిజాయితీ, నిబద్ధతలు, సంతృప్తికరమైన స్థాయిలో లేని కొత్తవారు ప్రవేశించిన తర్వాత సందేశప్రచార ఉద్యమం అభిప్రాయభేదాలు, సంఘర్షణల సుడిగుండంలో చిక్కుకున్నది. అప్పటి నుంచి ఇస్లామీయ చరిత్ర కొత్త మలుపు తిరిగింది. ఇటీవలి చరిత్రను పరిశీలిస్తే, సయ్యద్ అహ్మద్ షహీద్ (ర.అ) నడిపిన ఉద్యమం ప్రస్తావించదగింది. ఆయన వద్ద అనేక మంది చిత్తశుద్ధి, దృఢమనస్సు, అంకితభావం కలిగిన కార్యకర్తలు ఉండేవారు. కాని ఈ అత్యున్నత ప్రమాణాలు కలిగిన కార్యకర్తలలో సరిహద్దుల నుంచి కొన్ని చెల్లని నాణేలు కూడా వచ్చి కలిసిన తర్వాత ఇస్లామీయ సందేశ ప్రచార సూర్యుడు ఉదయించీ ఉదయించకముందే చీకట్లు క్రమ్ముకున్నాయి.

ఉద్యమాలను నిర్వీర్యం చేసే ఇతర కారణాలకన్నా ఈ ఆధ్యాత్మిక రుగ్మత నివారణ రీత్యా చాలా సున్నితమైనది, చాలా ముఖ్యమైనది. ఎందుకంటే ఈ రుగ్మత మనిషికి తెలియకుండానే అతనిలో తలెత్తుతుంది. అంతర్గతంగా చోటుచేసుకుని మనిషిలో నిబద్ధత, నిజాయితి, అంకితభావాల సంపదలను కొల్లగొడుతుంది.

అందువల్ల ఈ రుగ్మత ఆత్మపరిశీలనలో బయటపడడం చాలా కష్టం. లోతుగా పరిశీలించే దృష్టి కూడా దీనిని కనిపెట్టడంలో విఫలమవుతుంది. అదృష్టవశాత్తు ఈ రుగ్మతను గుర్తించడం జరిగినా, అది ఉందని ఒప్పుకోవడం అంత తేలిక కాదు. ఎందుకంటే ఈ వాస్తవాన్ని అంగీకరించడానికి పటిష్టమైన విశ్వాస శక్తి, నైతిక బలం అవసరమవుతాయి. కాగా, మానవ బద్ధశత్రువయిన షైతాన్ మనిషిని లొంగదీయడానికి సరియైన స్థానం అతని హృదయమేనని భావిస్తాడు. మనిషిలోని నిబద్ధత, చిత్తశుద్ధి, దైవం పట్ల అంకితభావాలను దెబ్బతీయడమే ముఖ్యమని తలుస్తాడు. అందువల్ల హృదయంలో చొచ్చుకుపోయిన తర్వాత, నిబద్ధత, చిత్తశుద్ధి, దైవం పట్ల అంకితభావాలను దెబ్బ తీసిన తర్వాత ఈ విజయాన్ని అంత తేలిగ్గా వదులుకోడు. చివరి వరకు ఈ విజయాన్ని నిలబెట్టుకోడానికి శాయశక్తులా ప్రయత్నిస్తాడు. తన వద్ద ఉన్న ఆయుధాలన్నీ ఉపయోగిస్తాడు. మనిషిలో తాను ధార్మికుడినన్న గర్వాన్ని రెచ్చగొడతాడు, లేదా మనిషిలో అహాన్ని తట్టిలేపుతాడు. ఒక్కోసారి అందమైన భ్రమల మత్తులో ముంచుతాడు. ఏదో విధంగా మనిషిలో దైవం పట్ల అంకితభావాన్ని నిద్రపుచ్చడానికి ప్రయత్నిస్తాడు. కాబట్టి మనిషితనలోని ఈ రుగ్మతను దేవుని అనుగ్రహం ఉంటేనే గుర్తించగలుగుతాడు. ఈ రుగ్మతను గుర్తించిన తర్వాతి దశ దీనిని నివారించడం. ఇది కూడా చాలా కష్టసాధ్యమైన పనే. ఇందుగ్గాను దృఢమైన సంకల్పం, సరియైన పద్ధతి, తగిన ధర్మనిష్ట, సుదీర్ఘ ప్రయత్నం అవసరమవుతాయి. ఈ ప్రయత్నంలో ఒక క్షణం ప్రమత్తత వహించిన గమ్యానికి వందల మైళ్ళు దూరమైపోవడం జరుగుతుంది. కాబట్టి ఈ మార్గంలో ప్రతి మజిలీ చాలా కఠినమైనది. ఓర్పు, సహనాలకు పరీక్ష పెడుతుంది ఈ ప్రయత్నం. కాని తన జీవిత లక్ష్యం పట్ల నిజమైన ప్రేమ ఉన్న వ్యక్తి, తన జీవిత లక్ష్యం నాశనం కావడాన్ని ఎన్నటికీ భరించలేని వ్యక్తి ఈ కఠినమైన మజిలీలను సంతోషంగా దాటక తప్పదు.

## 2. ధార్మిక జ్ఞానం, దూరదృష్టి లోపించడం

ఇస్లామీయ ఉద్యమాల వైఫల్యానికి, పతనానికి దారితీసే మరో ముఖ్యమైన కారణం ఇది. అసలయిన ధార్మికమూలాల నుంచి ప్రత్యక్షంగా మార్గదర్శనాన్ని

పొందగలిగే సామర్థ్యం లోపించడం వల్ల ధార్మిక ఉద్యమాలు పతనం అంచుకు చేరుతాయి. ఈ సామర్థ్యం లోపించడం వల్ల రెండు రకాల చెడులు చోటు చేసుకుంటాయి.

సరియైన ధార్మిక అభిప్రాయం (ఇజ్తిహాద్) ఏర్పరచుకునే సామర్థ్యం లోపిస్తుంది. పరిస్థితులను పరిశీలించే దూరదృష్టి లోపిస్తుంది. అంటే ఈ రుగ్మత చోటుచేసుకున్న తర్వాత ఉద్యమ ధ్వజవాహకుల్లో ఆలోచనాపరమైన జడత్వం, మేధోపరమైన నిస్తేజం అలుముకుంటాయి. అంతేకాదు, ఆలోచనల అరాచకం తలెత్తుతుంది. ఇస్లామీయ ఉద్యమానికి అసలయిన ధార్మికమూలాల నుంచి మార్గదర్శనం లభించే అవకాశాలు పుష్కలంగా ఉన్నప్పుడే, ధార్మిక విశ్లేషణా సామర్థ్యం ఆలోచనలను పదునుపెట్టే పరిస్థితి ఉన్నప్పుడే ఆ ఉద్యమం జవజీవాలను ప్రదర్శించగలదు, సరియైన మార్గాన ముందుకు సాగగలదు. ఇది ఒక శాశ్వత సత్యం. అయితే అందుగ్గాను ఉద్యమానికి సంబంధించిన బాధ్యులు ధార్మికమూలాల సమగ్రమైన పరిజ్ఞానం కలిగి ఉండడం అవసరం. అవసరమైన మార్గదర్శనాన్ని ప్రత్యక్షంగా పొందగలిగే సామర్థ్యం కలిగి ఉండడం అవసరం. అంతేకాదు, ఆ సామర్థ్యాన్ని ఉపయోగించి ప్రయోజనం పొందడం తెలిసినవారయి ఉండాలి. ఉద్యమానికి సంబంధించిన సాధారణ కార్యకర్తలు కూడా ధార్మిక అవగాహన, ధార్మిక స్పృహ కలిగినవారయి ఇస్లాంకు, అజ్ఞానానికి మధ్య ఉన్న మౌలిక భేదాలను గురించి స్పష్టమైన అవగాహన కలిగి ఉండాలి. మౌలిక ధార్మిక భావనలు, ఆలోచనల పరిజ్ఞానం కలిగినవారయి ఉండాలి. ధార్మిక హద్దులు, కట్టుబాట్లను ఖచ్చితంగా గుర్తించగలిగి ఉండాలి. ఈ విధంగా లేనట్లయితే, తమ బాధ్యతలను, పరిధులను బాధ్యతాయుతులు గుర్తించ లేనట్లయితే, దివ్యఖుర్ఆన్, ప్రవక్త (స) ప్రవచనాలను ఆచరణాత్మక మార్గదర్శకాలుగా స్వీకరించే సామర్థ్యం లోపిస్తే, ఒకవేళ సామర్థ్యం ఉన్నప్పటికీ ఆ సామర్థ్యం ద్వారా ప్రయోజనం పొందే ఆత్మవిశ్వాసం లోపిస్తే, మరోవైపు సాధారణ కార్యకర్తలు కూడా తప్పుదారిపడితే, తమకున్న కొద్దిపాటి, లేదా పరిమితమైన ధార్మికజ్ఞానం ఆధారంగా స్వయంగా ధార్మిక అవసరాలను నిర్ణయించుకోవడం ప్రారంభిస్తే, తమ ఇష్ట ప్రకారం ఉద్యమ దిశను నిర్దేశించడం

ప్రారంభిస్తే, ఆ పరిస్థితి ఉద్యమానికి సంక్షోభ పరిస్థితి అవుతుంది. సరంగు చతికిలబడి కూర్చున్న పడవలో, ప్రయాణీకులు తమ చేతులే తెడ్లుగా ఇష్టం వచ్చిన దిశలో పడవను తీసుకు వెళ్ళడానికి ప్రయత్నిస్తున్న పరిస్థితి ఉద్యమానికి దాపురిస్తుంది.

## 3. వ్యక్తి పూజ

మూడవ రుగ్మత - ఇది రెండవ రుగ్మతకు దగ్గరి సంబంధం ఉన్న రుగ్మత- వ్యక్తిపూజ. మనిషి మనో ప్రవృత్తిని అధ్యయనం చేస్తే ఈ రుగ్మత ధార్మిక ఉద్యమాలపై తీవ్రంగా దాడి చేసిందని తెలుస్తుంది. చారిత్రక సాక్ష్యాలు కూడా దీనిని ధృవీకరిస్తున్నాయి. ఈ రుగ్మత చోటు చేసుకుంటే ఫలితాలు చాలా ప్రమాదకరంగా ఉంటాయి. వ్యక్తిపూజ అంటే, ఉద్యమంలోని ప్రముఖ వ్యక్తి కోసం ఉద్యమంలోని సాధారణ కార్యకర్తలు ఉద్యమంతో సంబంధం కలిగి ఉండడం. అంటే ఆ ప్రముఖ వ్యక్తిపై విశ్వాసం ఉద్యమంతో సంబంధంకన్నా బలమైనదిగా ఉండడం. ఇలాంటి వాళ్ళు ఏది చూసినా ఆ ప్రముఖ వ్యక్తి కళ్లతో చూస్తారు. ఏదన్న విషయాన్ని ఆ ప్రముఖ వ్యక్తి అంగీకరిస్తేనే తాము కూడా అంగీకరిస్తారు. అలాంటి పవిత్రమైన వ్యక్తి అభిప్రాయాన్ని, తీర్పును, లేదా నిర్ణయాన్ని వివేకం, హేతుబద్ధతల గీటురాయిపై పరిశీలించడం, అలా పరిశీలించిన తర్వాతనే దానిని అంగీకరించడం ఆయన పట్ల అమర్యాద చూపడంగా భావిస్తారు. ప్రవక్త అభిప్రాయన్ని తప్ప ఇతరుల అభిప్రాయానికి అత్యంత పవిత్రతనివ్వడాన్ని తాము అంగీకరించమని మాటవరుసకు అంటారు. కాని ఆచరణలో మాత్రం తమ హృదయాల్లో ప్రతిష్టించుకున్న పవిత్రమైన వ్యక్తికి వ్యతిరేకంగా ఒక్కమాట కూడా వినడానికి ఇష్టపడరు. ఆ వ్యక్తి వెలిబుచ్చిన ఫలానా అభిప్రాయం సరిగా లేదని అందువల్ల ఆమోదయోగ్యం కాదని చెబితే ఒప్పుకోరు. ఈ వ్యక్తిపూజ ఒక రుగ్మత. ఈ రుగ్మత స్వయంగా ఆలోచించి నిర్ణయించుకునే సామర్థ్యాన్ని, విచక్షణాజ్ఞానాన్ని హరించివేస్తుంది. అంతేకాదు వాళ్ళు తమ హృదయాల్లో ప్రతిష్టించుకున్న వ్యక్తి మరణించిన తర్వాత వాళ్ళు అయోమయంలో పడి, ఆందోళనతో, దిక్కుతోచని వారిగా మిగిలిపోతారు. ఇక ఎలా ముందుకు సాగాలో తెలియని స్థితిలో

చిక్కుకుంటారు. ఆ వ్యక్తిని కోల్పోయిన బాధ, దుఃఖాలు అధికంగా ఉంటాయి కాని ఉద్యమ భవిష్యత్తు గురించిన చింత ఉండదు.

మనిషి మనోప్రవృత్తికి సంబంధించి ఇది అతి సున్నితమైన అంశం. ఇస్లాంలోను ప్రారంభంలో ఈ మనోప్రవృత్తికి సంబంధించిన నిదర్శనాలు కనబడ్డాయి. కాని ఆ కాలం నేటి కాలం వంటిది కాదు. భావావేశాల కారణంగా మార్గం తప్పడం, లేదా ఆలోచనల అరాచకం తలెత్తడానికి అవకాశం లేని కాలం అది. అందువల్ల అప్పట్లో ఈ రుగ్మత తలెత్తకముందే అంతమయ్యింది. కాని హజ్రత్ సయ్యద్ అహ్మద్ షహీద్ నడిపిన ఉద్యమం సందర్భంగా మాత్రం ఈ రుగ్మత చోటుచేసుకుని తన విపరీత పరిణామాలను ప్రదర్శించింది. ఈ రుగ్మతకు గురయిన అనేక మంది ఉద్యమకృషిని వదిలి ఏకాంతకుహరాలకు అంకిత మయ్యారు.

ప్రయత్నాలు, కృషి, నిబద్ధత అన్నింటి ఉద్దేశ్యం కేవలం దేవుని ప్రీతిని పొందడం మాత్రమే అన్న వాస్తవ జ్ఞానం హృదయాల్లో ఏవిధంగా చోటు చేసుకోవాలో అదే విధంగా నిజమైన మార్గదర్శకత్వాన్నిచ్చేది, నిజమైన నాయకత్వాన్నిచ్చేది కేవలం ప్రవక్త ముహమ్మద్ (స) మాత్రమే అన్న వాస్తవం కార్యకర్తల మనోమస్తిష్కాల్లో వేళ్ళూనుకోనంత వరకు ఈ ప్రమాదాలు వెంటాడుతూనే ఉంటాయి.

## 4. ధార్మిక భావనల్లో అసమతుల్యం

నాలుగవ ముఖ్యమైన కారణం, ధార్మిక భావనల్లో అసమతుల్యం. ఈ అసమతుల్యం ధార్మిక జ్ఞానం లేదా ధార్మిక దృష్టి లోపించడం వల్ల రావచ్చు, లేదా ఒక్కొక్కసారి బయటి కారణాల వల్ల చోటుచేసుకోవచ్చు. అంటే నిమ్నస్థాయికి చెందిన, లేదా సమతుల్యం లోపించిన ధార్మిక భావనలకు విరుద్ధపర్యవసానంగా చోటుచేసుకున్నవి కావచ్చు. ధార్మిక పునరుజ్జీవన ఉద్యమం ఏదైనా ఎలాంటి పరిస్థితుల్లో ముందుకు వస్తుందంటే, ధర్మాన్ని కాపాడవలసిన సముదాయం తన విధ్యుక్త ధర్మాన్ని నిర్లక్ష్యం చేస్తున్నప్పుడు, ఉదాసీనంగా వ్యవహరిస్తున్నప్పుడు లేదా తన విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించడానికి చేయవలసిన ప్రయత్నాలు చేయనప్పుడు,

అలాంటి పరిస్థితుల్లో ధార్మిక పునరుజ్జీవన ఉద్యమాలు తలెత్తుతాయి. సముదాయం ఇలాంటి వైఖరి ప్రదర్శించడానికి రెండు కారణాలు సర్వసాధారణంగా కనబడతాయి.

**మొదటి కారణం :** సముదాయంలో బాధ్యతాభావం, తపన లోపించడం.

**రెండవ కారణం :** ధార్మిక భావన కొద్దోగొప్పో అసమతుల్యాన్ని, తక్కువ స్థాయిని పొందడం.

ఈ పరిస్థితుల్లో, ఈ కారణాల నేపథ్యంలో కొందరు వ్యక్తులు దేవుని దయవల్ల ఆచరణా రంగంలో అడుగుపెడతారు. సత్యధర్మ పతాకాన్ని చేబూనుతారు. ప్రజలు అన్ని వైపుల నుంచి ఈ ధర్మధ్వజఛాయ క్రిందికి రావాలని వాళ్ళు అభిలషిస్తారు. అలా అభిలషించడం సహజం కూడాను.

ముస్లిం అనే పదానికి అర్థం పరలోకాన్ని విస్మరించడం కాదని, దేవునితో సంబంధం తెంచుకోవడం కాదని, స్వార్థప్రయోజనాలకు అధిక ప్రాధాన్యం ఇవ్వడం కాదని భావించే ముస్లిములు, దివ్యఖుర్ఆన్‌లో నమాజ్, రోజా వగైరాల గురించిన ఆయతులను ఎలా విశ్వసిస్తారో అదే విధంగా ముస్లిం సముదాయ ఉద్దేశ్యం లక్ష్యాలు, ఉనికి మనుగడలు అన్నీ సత్యానికి సాక్ష్యమివ్వడానికి, ధర్మసంస్థాపనానికి మాత్రమేనన్న దివ్యఖుర్ఆన్ వాక్యాలను కూడా మనస్ఫూర్తిగా విశ్వసించే వారిలో ఈ అభిలాష సహజంగానే అధికంగా ఉంటుంది. ఈ అభిలాషతో ప్రజలను పిలుస్తూ వీధి వీధికి, ఇంటింటికి తిరుగుతారు. ప్రతి ఇంటి తలుపు తడతారు. గుడిసెల నుంచి మేడల వరకు, ఆరాధనాలయాల నుంచి రాజకీయ నిలయాల వరకు ప్రతిచోట తమ పిలుపు వినిపిస్తుంటారు. కాని ఈ ప్రయత్నాల వల్ల ఒనగూడే ఫలితాలు సాధారణంగా వారి అభిలాషలకన్నా చాలా తక్కువగా ఉంటాయి. తమ ఆహ్వానాన్ని, తమ పిలుపును ఎవరూ పట్టించుకోవడం లేదని, ప్రజల హృదయద్వారాలు మూసుకుపోయాయని అత్యంత నిరాశ, నిస్పృహలతో గమనిస్తారు. ఈ పరిస్థితి చూసి వాళ్ళు ఇలా ఎందుకు జరుగుతుందన్న చింతలో మునిగిపోతారు. వాస్తవం కానిది, సత్యం కానిది, అవసరం లేనిది ఏదీ ప్రజలముందు ప్రతిపాదించడం జరుగడం లేదు, ముస్లిములు

వ్యతిరేకించే విషయం ఏదీ తాము చెప్పడం లేదు అయినా ఈ ఉదాసీన వైఖరి ఎందువల్ల అనేది వారికి అర్థం కాదు. ఈ సమీక్ష ఆలోచనల సందర్భంగా వాళ్ళు ప్రజల మానసిక పరిస్థితులను విశ్లేషించడం జరిగినప్పుడు వారి ముందు పైన పేర్కొన్న రెండు కారణాలు కనబడతాయి. అంటే బాధ్యతాభావం లోపించడం, ధార్మిక భావనలో అసమతుల్యం చోటుచేసుకోవడం. అందువల్ల ఈ రెండు కారణాలను తొలగించి తమ లక్ష్య సాధనకు అనుకూల వాతావరణాన్ని ఏర్పరచాలని వాళ్ళు ప్రయత్నాలు ప్రారంభిస్తారు. మొదటి రుగ్మతకు సంబం ధించినంత వరకు దానిని తొలగించడానికి వాళ్ళు సూచించే పద్ధతులను, బోధనలను ప్రారంభంలో ప్రజలు కనీసం వింటారు. శ్రద్ధగా తలదించుకుని చెవులొగ్గి మరీ వింటారు. తమ తప్పిదాలను గుర్తిస్తున్నట్లు కూడా వింటారు. మౌనంగా వింటారు. కాని రెండవ రుగ్మత విషయం అంత తేలికయినది కాదు. అందుకు కారణం ఏమంటే, ప్రజల ధార్మిక భావనలలోని లోపాన్ని లేదా అసమతుల్యాన్ని తొలగించడం అన్నది ఆ విషయమై వారిని విమర్శించనంత వరకూ సాధ్యం అయ్యే పని కాదు. అందువల్ల ఇష్టం ఉన్నా లేకపోయినా ఉద్యమ ధ్వజాన్ని మోస్తున్నవాళ్ళు ఈ బాధ్యతను కూడా నిర్వర్తించ వలసి వస్తుంది. ప్రజలలో ధార్మిక భావనల్లో అసమతుల్యం లేదా లోపం తీవ్రస్థాయిలో ఉండి వారిలో ధార్మిక బాధ్యతాభావాన్ని అంతమొందిస్తుంటే, లేదా ధార్మిక బాధ్యతా భావం తలెత్తనీయకుండా అణచివేస్తుంటే అలాంటి పరిస్థితుల్లో ఉద్యమ ధ్వజ వాహకులు ఈ విమర్శనా బాధ్యతను ప్రప్రథమంగా నిర్వర్తించవలసి ఉంటుంది. కాని ఆలోచనా దృక్పథాలు, సిద్ధాంతాలపై విమర్శ అన్నది ఎంత సత్యబద్ధమైనది అయినప్పటికీ దానిని వినే వాళ్ళు సాధారణంగా భరించలేరు. పైగా ఈ విమర్శ ఏదో మామూలు ఆలోచనలు, సిద్ధాంతాలపై కాదు, ప్రజలకు అత్యంత ఇష్టమైన, మనోభావనలపై చేస్తున్న విమర్శ. కాబట్టి విమర్శ పూర్తికాక ముందే ప్రజలు రెచ్చిపోవడం, అన్ని వైపుల నుంచి ఉద్యమంపై విమర్శల కుంభవృష్టి కురవడం ప్రారంభమవుతుంది. వ్యతిరేకత వరదలా ముంచెత్తుతుంది. పిడివాదం, మంకుతనం ప్రభావం చూపుతాయి. ఉద్యమానికి సంబంధించిన మౌలిక నియమాలు, ఉద్దేశ్యాలపై కూడా దాడి మొదలవుతుంది. ఈ దాడి ప్రత్యక్షంగా

ఉండవచ్చు, పరోక్షంగా ఉండవచ్చు. ఈ పరిస్థితి వల్ల ఉద్యమ కార్యకర్తలు కూడా ప్రభావితులు కాకుండా ఉండలేరు. అలా ప్రభావితులు కావడమన్నది సహజపరిణామం. అందువల్ల వారి ప్రతిస్పందన కూడా అదేవిధంగా ఉంటుంది. తక్కువ స్థాయి ధార్మిక భావనల పట్ల వారి కాఠిన్యం కూడా పెరిగిపోతుంది. భావనలలోని లోపాలే ఈ పరిస్థితికి కారణమన్నది వాళ్ళు గుర్తిస్తారు. ధార్మిక భావాలున్న ముస్లిములు కూడా ఉద్యమం ప్రతిపాదించే లక్ష్యంలో పాలుపంచుకోకుండా నిరోధిస్తున్నది ఈ భావనల లోపాలే అన్నది వాళ్లు చూస్తున్నారు. నిజానికి ఉద్యమం ప్రతిపాదించే లక్ష్యం ముస్లిములందరి జీవిత లక్ష్యం. ఈ లక్ష్యం నుంచి వారిని దూరంగా ఉంచుతున్న భావనలపై బలంగా దాడి చేయాలని వాళ్ళు నిర్ణయించుకుంటారు. కాని ఈ సందర్భంగా ధార్మికోద్యమ కార్యకర్తలు కూడా ధార్మిక భావనలకు సంబంధించి ఒక ప్రతిక్రియాత్మకమైన అసమతుల్యానికి గురయ్యే ప్రమాదం ఉంది. వారి ప్రతిస్పందనల్లో అసాధారణ కాఠిన్యం, అతివాదం చోటుచేసుకునే అవకాశం ఉంది. ఒక తప్పుకు జవాబుగా వాళ్ళు కూడా అనుకోకుండా మరొక తప్పు చేసే పరిస్థితి తలెత్తవచ్చు. ఈ పరిస్థితుల్లో అతివాదానికి దూరంగా ఉండగలిగేది దేవుని అనుగ్రహం వల్ల అసాధారణ ధార్మిక దృష్టి, సహన స్వభావం, పటిష్టమైన ఆలోచనాశక్తి ఉన్న వాళ్ళు మాత్రమే. ఉద్యమం పట్ల తలెత్తిన వ్యతిరేకతల సందర్భంగా చాలా మంది అతివాదానికి గురి కావడం సర్వసాధారణం. ఆ విధంగా సమతుల్యాన్ని కోల్పోవడం జరుగవచ్చు. సాధారణంగా వ్యతిరేకించే వారు ధర్మంలో ఏమాత్రం ప్రాధాన్యం లేని విషయానికి అత్యంత ప్రాధాన్యం ఇవ్వాలని పట్టుబట్టడం జరుగుతుంది. కాగా ఈ సందర్భంగా అతివాదానికి గురయిన కార్యకర్తలు ఆ విషయానికి సముచితమైన స్థానం ఇవ్వడానికి కూడా వ్యతిరేకించడం జరుగుతుంది. అలాగే వ్యతిరేకిస్తున్న వారు ఏదైనా విషయానికి తగిన ప్రాధాన్యం ఇవ్వనట్లయితే, ఉద్యమ కార్యకర్తలు ఆ విషయానికి అవసరం కన్నా అధిక ప్రాముఖ్యాన్ని కట్టబెట్టడం కూడా జరుగుతుంది.

ఉదాహరణకు సాధారణంగా ధార్మిక భావాల రీత్యా సమతుల్యం లేని వారు దేవుని గుణగణాల్లో ఏదో ఒక లక్షణానికి అత్యధిక ప్రాముఖ్యం,

ప్రాధాన్యతలు కట్టబెట్టడం వల్ల దేవుని ఇతర గుణగణాల విషయమై వాళ్ళు ఉపేక్షకు గురవుతారు. ఫలితంగా వారి ధార్మిక భావనల్లో ఒక విధమైన అసమతుల్యం చోటుచేసుకుంటుంది. అలాంటి వారు ఎదురైనప్పుడు ఉద్యమ కార్యకర్తలు అతివాదానికి పోయి, ఎదుటివారి వైఖరికి పూర్తి వ్యతిరేకమైన వైఖరిని అవలంబించే ప్రమాదం ఉంది. అంటే దేవునికి సంబంధించిన ఇతర గుణగణాలను ఎదుటి వారు ఉపేక్షించడం జరిగినప్పుడు, ఉద్యమ కార్యకర్తలు ఆయా గుణగణాలకు అత్యధిక ప్రాముఖ్యం ఇచ్చి ఎదుటి వ్యక్తి అత్యధిక ప్రాముఖ్యం ఇస్తున్న లక్షణాన్ని ఉపేక్షించే వైఖరిని ప్రదర్శించవచ్చు.

ఇది సూత్రప్రాయంగా విషయాన్ని వివరించడానికి చెప్పిన ఉదాహరణ. ఈ ఉదాహరణ ఆధారంగా ఇస్లామీయ బోధనలన్నింటి విషయంలో అంచనా వేయవచ్చు. ఇలాంటి ప్రతిక్రియాత్మక అసమతుల్యం వల్ల అసలయిన, సమగ్రమైన ధార్మిక వైఖరి ప్రకటితమవ్వదు. ధర్మానికి సంబంధించిన అసలయిన శోభాన్విత రూపంపై ఈ అతివాదాల ముసుగు క్రమ్ముకుంటుంది. ధార్మిక భావనలకు సంబంధించి అతివాదం, అసమతుల్యం అది ఎవరి వల్ల అయినా సరే అతివాదమే, అసమతుల్యమే. ఉద్యమ కార్యకర్తలు, ధ్వజవాహకులు అవలంబించినా, లేక సాధారణ ప్రజలు అవలంబించినా అది అతివాదమే. ఈ అతివాదం విపరిణామాలను అనుభవించక తప్పదు. ముఖ్యంగా ఉద్యమ కార్యకర్తలు ఈ అతివాదానికి గురికావడం మరింత ప్రమాదకరం. ఇలాంటి అతివాదంతో, ధార్మిక భావనల అసమతుల్యంతో జరిగే ప్రయత్నాలను ధార్మిక ప్రయత్నాలుగా పేరు పెట్టుకున్నప్పటికీ అవి ధార్మిక పునరుజ్జీవన ప్రయత్నాలని లేదా ధర్మసంస్థాపనా ప్రయత్నాలని భావించడానికి వీలులేదు. ధర్మసంస్థాపనం దృష్ట్యా ఇలాంటి ప్రయత్నాలు అవాంఛనీయమైనవి. సరియైన ధార్మిక భావనలు, ధార్మిక దృష్టి ఉన్నవారు ఇలాంటి ప్రయత్నాల వల్ల ఉద్యమానికి దూరం అయిపోతారు. అంతేకాదు, ముందుకు పడే ప్రతి అడుగు రుజుమార్గాన్ని తప్పి ప్రక్కకు పోతూ ఉంటుంది. చివరకు ముస్లిం సముదాయం, చరిత్రలో విభేదాల కొత్త అధ్యాయాన్ని రచించి అంతం అవుతుంది.

## 5. వర్గవివక్ష

ఐదవ రుగ్మత వర్గవివక్ష. మనిషికి ఉన్న ఒక ముఖ్యమైన బలహీనత ఏమంటే, మనిషి ఇతరుల విషయంలో ఏ ప్రమాణాలు అన్వయింపజేస్తాడో తన విషయంలో అవే ప్రమాణాలకు అంగీకరించడు. తన విషయంలో ఉదారవైఖరి, మృదువైఖరి అవసరమని భావిస్తాడు. తన విషయంలో విశాల దృక్పథం, కాని ఇతరుల విషయంలో సంకుచిత దృక్పథం. తన కోసం అన్ని విధాల మినహాయింపులు, రాయితీలు కావాలి. కాని ఇతరులకు మాత్రం కట్టుబాట్లు కఠినంగా అమలు చేయాలి. ఈ పక్షపాతం, వివక్షలు కేవలం వ్యక్తిగత ప్రయోజనాల వరకే కాదు, ఇంకా విస్తరించి తన కుటుంబం, తన వంశం, తన వర్గం, తన జాతి వగైరాలకు సంబంధించి కూడా ఈ వైఖరినే ప్రదర్శిస్తాడు. కొన్ని సందర్భాలలో వర్గ, వంశ పక్షపాతం వ్యక్తిగతంగా తన పట్ల మినహాయింపులు కావాలని కోరడంకన్నా అధికంగా ఉంటుంది. ఎందుకంటే, వ్యక్తిగతంగా మినహాయింపులు, ప్రయోజనాలకు ప్రాకులాడినప్పుడు అన్ని వైపుల నుంచి విమర్శలు ఎదురవుతాయి. చివరకు అతని ఆత్మసాక్షి కూడా, అది బ్రతికి ఉంటే తప్పక నిరసిస్తుంది. కాని వంశం కోసం, వర్గం కోసం, పార్టీ కోసం, జాతి కోసం, సముదాయం కోసం, తన జమాఅత్ కోసం ఈ పక్షపాత వైఖరి అవలంబిస్తే అతన్ని ఎవరూ విమర్శించరు. పైగా అన్ని వైపుల నుంచి ప్రశంసలు వినిపిస్తాయి. అన్ని వైపుల నుంచి జిందాబాద్ నినాదాలు పెల్లుబుకుతాయి. అందరూ అతన్ని నెత్తిన పెట్టుకుంటారు. అతని ఆత్మసాక్షి విషయానికి వస్తే, అది ప్రశంసలు, పొగడ్తల వెల్లువలో కొట్టుకుపోతుంది. అతను చేసేది సమ్మతమే అన్న భ్రమలో మునిగిపోతుంది.

మనిషి ప్రవృత్తిలోని ఈ బలహీనత చాలా ప్రబలమైనది. మనిషిని క్షణాల్లో వశం చేసుకునే శక్తి దానికి ఉంది. నిజాయితీతో, పవిత్రమైన సంకల్పంతో ఇస్లామీయ ఉద్యమ ధ్వజాన్ని చేబూనిన వర్గం కూడా ఈ రుగ్మతకు గురికాకుండా సురక్షితంగా ఉండడమన్నది జరుగదు. మన ముందు పూర్తి ఇస్లామీయ చరిత్ర ఉంది. ఈ చరిత్రను అధ్యయనం చేస్తే ఈ రుగ్మత ఏ విధంగా ముస్లిం

సముదాయాన్ని ముక్కలు చెక్కలు చేసిందో అర్థం చేసుకోవడం కష్టం కాదు. అనేక ధార్మిక ఉద్యమాలు సత్యధర్మసంస్థాపనానికి నడుంకట్టిన ఉద్యమాలు కూడా ఈ అజ్ఞానంతో కూడిన పక్షపాత వైఖరుల పుణ్యం కొద్ది చివరకు గమ్యాన్ని చేరుకోలేక ఎటో వెళ్ళిపోయాయి. వాస్తవమేమంటే, ఇలాంటి ఉద్యమాలకు ప్రారంభంలో విశ్వాసశక్తి తోడు ఉంటుంది. చేతిలో దివ్యఖుర్ఆన్ మార్గదర్శనం ఉంటుంది. కాని ఉద్యమంలో ఈ రుగ్మత చోటుచేసుకున్న తర్వాత తన వర్గం, తన వాళ్ళు మాత్రమే సమస్తం అయిపోతారు. తన వర్గ ప్రయోజనాలే సత్యధర్మ ప్రయోజనాలుగా భావించడం, తన వర్గాన్ని కాపాడడమే సత్యధర్మాన్ని కాపాడడంగా భావించడం మొదలవుతుంది. తన వర్గం అభిప్రాయాలు, దృక్పథాల విషయంలో ఉదారంగా వ్యవహరించాలని, గౌరవదృష్టులతో చూడాలని, వాటిలో ఏవయినా లోపాలున్నా పట్టించుకోరాదని, ఇతరుల అభిప్రాయాలు, దృక్పథాలను కఠినంగా పరిశీలించాలని, వాటిలో ఉన్న గొప్ప విషయాలు మెప్పు పొందే పాటివి కావని భావించడం ప్రారంభమవుతుంది. అంటే తన వర్గం తప్పొప్పులు రెండూ చేయగలిగిన మనుష్యమాత్రుల వర్గం కాదన్నట్లు, దైవదూతల పవిత్రమైన వర్గమైనట్లు, వారి వల్ల అణుమాత్రం కూడా పొరబాటు జరిగే ప్రసక్తి లేదన్నట్లు వ్యవహారశైలి ఉంటుంది. ధర్మనిష్ట, ధర్మపరాయణత్వాలకు సంబంధించి తామే గొప్పగా భావించే ఈ ధోరణి స్వయంగా మార్గభ్రష్టత్వానికి నిదర్శనం. హృదయంలో విశ్వాస శక్తి, దైవం పట్ల అంకిత భావం పూర్తిగా లోపించాయన డానికి రుజువు. ఈ రుగ్మత ధర్మనిష్ట, ధర్మపరాయణత్వం వగైరా రూపాల్లో ఉండడం అత్యంత ప్రమాదకరమైన పరిణామం. ఈ వేషాల్లో ఈ రుగ్మత చోటు చేసుకున్నప్పుడు అందులో అసాధారణ ఆకర్షణ కూడా ఉంటుంది. ఈ వైఖరి పట్ల మనిషిలో అపరాధభావానికి బదులు ఒక విధమైన గర్వం చోటుచేసుకుంటుంది. ఎందుకంటే సత్యం ముసుగులో ఉన్న అజ్ఞానం మనిషి మనస్తత్వానికి అత్యంత ఆకర్షణీయంగా ఉంటుంది. ఈ విధమైన అజ్ఞానానికి గురయిన వ్యక్తి ముందు ఇతరులు ప్రస్ఫుటమైన ఆధారాలతో సత్యాన్ని ప్రతిపాదించినప్పటికీ నిర్ద్వంద్వంగా నిరాకరిస్తాడు. యూద పండితుల మాదిరిగా ప్రజలతో, "మీ మతాన్ని పాటించే వ్యక్తి మాటలనే నమ్మండి" అంటూ చెబుతూ తిరుగుతాడు.

ఇలాంటి రుగ్మతకు గురయినవారి ప్రయత్నాల వల్ల సత్యధర్మానికి ప్రయోజనం చేకూరుతుందని నమ్మడం అవివేకమే అవుతుంది. వంశం, వర్గం తదితర సంబంధాలకు ప్రాధాన్యం ఇచ్చేవాళ్ళు, సత్యాన్ని గుర్తించి అంగీక రించడంలో కూడా తమ పర భేదాలు పాటించేవాళ్ళు నిజానికి తమ వర్గ నినాదా లకు ఔన్నత్యం సాధించడానికి ప్రయత్నిస్తున్నారు. సత్యధర్మ ఔన్నత్యానికి ప్రయత్నిస్తున్నామని చెబుతుంటే ఆ మాటలు అబద్ధాలు తప్ప మరేమీ కావు. తన వర్గాన్ని, తన దేవుడిని ఒకే సమయంలో ఆరాధించడం ఎవరికీ సాధ్యం కాని పని.

## 6. భావప్రకటనా స్వేచ్ఛ - దుర్వినియోగం

ఇక ఆరవ రుగ్మత భావప్రకటనా స్వేచ్ఛను దుర్వినియోగపరచడం. ఈ దుర్వినియోగం ఒక పరిమితిని దాటితే ఉద్యమం సంక్షోభంలో చిక్కుకుంటుంది. భిన్న అభిప్రాయాల సుడిగుండంలో ఉద్యమం సరియైన మార్గాన ఒక్క అడుగు ముందుకు సాగడం కూడా కష్టమైపోతుంది. ముందుకు సాగడం కాదు, ప్రతిగా తిరోగమనం ప్రారంభమవుతుంది. కొండనెక్కుతున్న ట్రయిను ఇంజను తెగి వేరయిపోతే ఎలా క్రిందికి దొర్లుతుందో అదే విధంగా ఉద్యమం కూడా వెనక్కి దొర్లుతుంది.

ఆలోచనా పరిశీలనాశక్తి మనిషికి దేవుడిచ్చిన వరం అన్నది నిర్వివాదాంశం. ఈ శక్తిసామర్థ్యాలను ఉపయోగించడం ప్రతి మనిషికి పుట్టుకతో లభించిన హక్కు. ఇందులో మరో అభిప్రాయానికి తావు లేదు. ఈ హక్కును ఎవ్వరు, ఎన్నడూ హరించడానికి వీలు లేదు. అంతేకాదు, ఈ హక్కును ఉపయో గించి ప్రయోజనం పొందని వ్యక్తి మనిషిగా తన హోదాను కోల్పోతాడు. అందు వల్లనే మానవ సహజ ప్రవృత్తికి తగిన ధర్మం – ఇస్లాం, మనిషికి తన బుద్ధీ వివేకాలు ఉపయోగించి పనిచేసే హక్కు ఉందనే కాదు, అలా పనిచేయడం అతని బాధ్యత కూడా అని స్పష్టంగా చెప్పింది. బుద్ధివివేకాలు ఉపయోగించి పనిచేయని వ్యక్తిని ఇస్లాం పశుతుల్యునిగా అభివర్ణించింది. అలాగే తెలిసి కూడా సత్యాన్ని ప్రకటించకుండా మౌనంగా ఉన్న వ్యక్తిని మూగ షైతానుగా పేర్కొన్నది. అయితే బుద్ధివివేకాలు, ఆలోచనా పరిశీలనలు, భావప్రకటనా స్వేచ్ఛలను సరియైన

విధంగా, సమతుల్యంగా, బాధ్యతాభావంతో ఉపయోగించాలన్నది ఇస్లాం స్ఫూర్తి. విశృంఖలంగా దుర్వినియోగం చేయడానికి ఇస్లాం అనుమతించలేదు. బుద్ధీవివేకాలను, భావప్రకటనా స్వేచ్ఛను దుర్వినియోగపరచడం అన్నది అసలు ఉపయోగించకపోవడం మాదిరిగానే ఖండించదగ్గ విషయం. భావప్రకటనా స్వేచ్ఛ దుర్వినియోగమయ్యే కాలం ముస్లిం సముదాయానికి సంబంధించి అతి చెడ్డ కాలంగా తీర్మానించింది. సముదాయంలో వ్యక్తులు తమ బాధ్యతలను మరచి ఆలోచనా, భావప్రకటనా స్వేచ్ఛలను దుర్వినియోగపరచడం వల్ల ప్రతి వ్యక్తి తన అభిప్రాయాన్ని పూజించే వాడయిపోతాడు. ఫలితంగా ఒక విధమైన ఆలోచనల అరాచకం వ్యాపిస్తుంది. ఈ విషయాన్ని ప్రవక్త (స) ఒక హెచ్చరికగా క్రింది విధంగా చెప్పారు.

" ...... చివరకు సమస్తం మనోకాంక్షల చేతుల్లో ఉండడాన్ని నీవు చూస్తావు. ప్రాపంచిక జీవితానికి ధర్మంపై ఆధిక్యాన్ని ఇవ్వడాన్ని చూస్తావు. తన అభిప్రాయం కలిగిన ప్రతి వ్యక్తి తన ఇష్టానికే అంకితమవుతాడు. నీవు కూడా స్వయంగా ఈ రుగ్మతల్లో చిక్కుకున్నట్లు నీకు అనిపిస్తుంది. అలాంటి పరిస్థితిలో నీ గురించి ఆలోచించు, ఇతరులను వారి మానాన వారిని వదిలిపెట్టు."

*(మిష్కాత్)*

కాస్త ఆగి ఆలోచించండి. ఈ హదీసులో, " ప్రతి వ్యక్తి తన ఇష్టానికే అంకితమవుతాడు" అని మాత్రమే చెప్పలేదు. "సొంత అభిప్రాయం కలిగిన ప్రతి వ్యక్తి తన ఇష్టానికి అంకితమవుతాడు" అని చెప్పడం జరిగింది. అంటే ప్రతి వ్యక్తి తన అభిప్రాయానికి మాత్రమే ప్రాధాన్యం ఇవ్వడం మొదలవుతుంది. అలాంటి పరిస్థితిలో ఒక ముస్లిం మంచిని ఆదేశించడం, సమాజాన్ని సంస్కరించడం అన్న విధుల నిర్వహణ విషయంలో నిరాశచెంది ఊరుకోవడాన్ని ధార్మిక వైఖరిగా పేర్కొనడం జరిగింది. దీన్నిబట్టి ఆ పరిస్థితి ఎంత సంక్షోభ భరితమైనదో అంచనా వేయవచ్చు. ప్రతి వ్యక్తి అతను సొంత అభిప్రాయాన్ని ఏర్పరచుకునే అర్హత ఉన్న వాడయినా కాకపోయినా సరే ఏదో ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకుని దానికే అంకితమైపోవడం, ఆ అభిప్రాయానికే గట్టిగా కట్టుబడడం జరిగితే ఎలాంటి సంక్షోభం తలెత్తుతుందో అర్థం చేసుకోవచ్చు.

ఈ రుగ్మత అతి తీవ్రమైనది. దీనిని నివారించడానికి సాధారణ ప్రజలు ధైర్యం చేయలేని రుగ్మత ఇది. ఆలోచన, భావప్రకటన స్వేచ్ఛలను అజాగ్రత్తగా, విశృంఖలంగా, బాధ్యతారహితంగా దుర్వినియోగం చేయడం అన్నది ఎంత ప్రమాదకరమైన రుగ్మతో అర్థం చేసుకోవడానికి పైన చెప్పిన హదీసు చాలు.

ఏ సంస్థలో అయినా లేదా ఏ ఉద్యమంలో అయినా అందులోని వ్యక్తులకు భిన్నాభిప్రాయాలు ఉండడం సహజమే. ఆలోచించి, పరిశీలించి ఎవరైనా ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకునే హక్కు ప్రతి వ్యక్తికి ఉంటుంది. తన అభిప్రాయాన్ని తగిన సమయంలో పటిష్టమైన సాక్ష్యాధారాలతో బలంగా వినిపించే హక్కు కూడా ఉంటుంది. కాని తన అభిప్రాయాన్నే సరియైనదిగా, సత్యబద్ధమైనదిగా అందరూ ఒప్పుకోవాలని ఒత్తిడి చేసే హక్కు ఎవరికీ ఉండదు. తన అభిప్రాయం పొరబాటు కూడా కావచ్చన్న విషయాన్ని తప్పనిసరిగా దృష్టిలో ఉంచుకోవాలి. ఇతరుల అభిప్రాయం సరియైనది కావచ్చన్న విషయమూ దృష్టిలో ఉండాలి. అతని సమస్యను పూర్తిగా సమగ్రంగా పరిశీలించి ఉండకపోవచ్చు, అవసరమైన విషయాలు అతని దృష్టికి రాకపోవడం జరిగి ఉండవచ్చు. లేదా ఇతరులు తమ అభిప్రాయాన్ని బలమైన సాక్ష్యాధారాలతో ప్రతిపాదించడం జరిగి ఉండవచ్చు. ఇతరులు ప్రతిపాదించిన సాక్ష్యాధారాలను అతను సరిగా అర్థంచేసుకోవడంలో విఫలమై ఉండవచ్చు. ఈ సాధ్యాసాధ్యాలన్నింటిని పరిశీలించిన తర్వాత కూడా అతనికి తన అభిప్రాయమే సరియైనదని అనిపిస్తే, తన అభిప్రాయం పట్ల పూర్తి సంతృప్తి ఉన్నట్లయితే, ఇతరుల అభిప్రాయాలకు తన అభిప్రాయంకన్నా మేలైనవిగా సంతృప్తి చెందనట్లయితే, అధికసంఖ్యాకుల అభిప్రాయం కారణంగా అతని అభిప్రాయం ఆమోదాన్ని పొందనట్లయితే, అలాంటి పరిస్థితిలో విశాల హృదయంతో ఇతరుల అభిప్రాయాన్ని అంగీకరించడం, ఆచరణకు సంబంధించి తన అభిప్రాయాన్ని వదులుకోవడం అవసరం. కాని ఆ విధంగా జరిగిన నిర్ణయం వల్ల ఉద్యమానికి తీవ్ర నష్టం కలుగుతున్నప్పుడు, ఆ నిర్ణయం వల్ల దురదృష్టవశాత్తు, ఇస్లామీయ బోధనలు కూడా మరుగునపడిపోతున్న పరిస్థితి ఉంటే తప్ప ఆ నిర్ణయాన్ని వ్యతిరేకించరాదు. కాని కేవలం భేదాభిప్రాయాలే అయినట్లయితే

తన అభిప్రాయాన్నే అందరూ అంగీకరించాలని పట్టుపట్టే హక్కు అతనికి ఉండదు. సామూహిక నిర్ణయం కోసం తన ఇష్టాయిష్టాలను, తన అభిప్రాయాలను త్యాగం చేయడానికి సిద్ధంగా లేని వ్యక్తులు ఉన్నప్పుడు ఆ ఉద్యమం ముందుకు సాగడం కష్టమైపోతుంది.

తన అభిప్రాయమే సత్యమైనదని, సరియైనదని భావించే హక్కు ప్రవక్త (స) కన్నా ఎక్కువగా ఎవరికి ఉంటుంది. కాని ప్రవక్త(స) అనేక పర్యాయాలు ఇతరుల అభిప్రాయాలను మన్నించి తన అభిప్రాయాన్ని రద్దుచేసుకున్న ఉదాహరణలు అనేకం ఉన్నాయి. ప్రవక్త (స) తన అనుచరులందరి ఏకాభిప్రాయాన్ని కాదని ఏదన్నా నిర్ణయం చేసినా ఆయన నిర్ణయాన్ని ఏ ఒక్కరు కూడా వ్యతిరేకించని పరిస్థితి, అధికారం ఉన్నప్పుడు కూడా ఆయన ఎన్నడూ తన అభిప్రాయమే అందరూ అంగీకరించాలని పట్టుపట్టలేదు సరికదా, ఇతరుల అభిప్రాయాలలోని మంచిని గ్రహించి తక్షణం అంగీకరించేవారు. స్వయంగా ప్రవక్త (స) ఉదాహరణ మనముందు ఉన్నప్పుడు, ఇతరులకు తమ అభిప్రాయమే సరియైనదని పట్టుపట్టే హక్కు ఎక్కడిది? తన అభిప్రాయం దైవవాణి వంటిదని, దానిని కాదంటే నష్టాలు తప్పవని అందరిపై ఒత్తిడి తెచ్చే హక్కు ఎవరికైనా ఎక్కడుంది?

ఆలోచన, భావప్రకటనా స్వేచ్ఛ వేరు, తన అభిప్రాయాలనే సరైనవిగా భావించే ధోరణి వేరు. ఆలోచన, భావప్రకటనా స్వేచ్ఛలు ఆరోగ్యకరమైన విధంగా, సమతుల్యంగా ఉన్నప్పుడు ఇస్లామీయ ఉద్యమం శక్తిసామర్థ్యాలు ప్రదర్శిస్తూ ముందుకు సాగగలదు. కాని తన అభిప్రాయంతో, తాను చెప్పిందే సత్యమన్న వైఖరి చోటుచేసుకున్నట్లయితే ఉద్యమం చతికిలబడుతుంది. అలాంటి పరిస్థితుల్లో ఉద్యమానికి సొంత కార్యకర్తలే గొడ్డలిపెట్టు అవుతారు.

ముస్లిం సముదాయం చరిత్రలో ఈ వాస్తవాలను చాటిచెప్పే ఉదాహరణలు అనేకం ఉన్నాయి. ప్రముఖ ఖలీఫాల కాలం గతించక ముందే సముదాయంలో చోటుచేసుకున్న భేదాభిప్రాయాల రుగ్మత నేటి వరకు కొనసాగుతూనే ఉంది. ఆలోచనా ఆచరణల సమైక్య వ్యవస్థగా ముందుకు వచ్చిన ధర్మాన్ని అనుసరించే వారు నేడు అసంఖ్యాక ముక్కలు చెక్కలయి ఉన్నారు. ఈ దయనీయ

స్థితికి కారణం భేదాభిప్రాయాలలో తన అభిప్రాయానికే పెద్దపీట వేయాలన్న అరాచకం. చివరకు అంతగా ప్రాధాన్యం లేని కొన్ని ఆలోచనా దృక్పథాల పరిరక్షణే సత్యధర్మానికి సాక్ష్యమివ్వడంగా మారింది. ఈ సందర్భంగా ఎదురయ్యే పెద్ద సమస్య ఏమంటే, సొంత అభిప్రాయాన్ని గౌరవించుకునే రుగ్మతకు గురయిన వ్యక్తికి తాను అలాంటి రుగ్మతకు గురయ్యానన్న స్పృహ ఉండదు. ఆ రుగ్మతే ఆరోగ్యానికి చిహ్నంగా భావిస్తాడు. తన అభిప్రాయాన్ని వదులుకోవడం ధర్మనిష్ఠకు దూరంకావడంగా భావించే స్థాయికి చేరుకుంటాడు.

ఈ రుగ్మత తీవ్రస్థాయికి చేరుకున్నప్పుడు వ్యక్తుల శ్వాసలో కూడా విభేదాలు, వైమనస్యాల సూక్ష్మజీవులు వ్యాపిస్తుంటాయి. సమాజం భేదాభిప్రాయాల సంక్షోభానికి నిలయమైపోతుంది. ఒకే గమ్యం, ఒకే లక్ష్యం ఉన్న సమైక్య బృందం అని చెప్పుకోవడమే కాని వాస్తవానికి విభిన్న అభిప్రాయాల కారడవుల్లో వేర్వేరుగా తచ్చాడుతున్నవారవుతారు.

దేవుని ధర్మాన్ని పునరుజ్జీవింపజేయడానికి, జీవితంలోని అన్ని రంగాల్లో సత్యధర్మాన్ని స్థాపించడానికి నడుంకట్టిన ప్రతి ఇస్లామీయ ఉద్యమం ఇలాంటి ప్రమాదకరమైన రుగ్మత విషయమై ఎల్లప్పుడు దేవుని శరణు కోరుతూ ఉండాలి.

